“నారదో రజకపుత్రికః” అను వాక్యము ననుసరించి నారదుఁడు చాకలిదాని కొడుకు గాఁ బాడకట్టు చున్నాఁడు; కాని వీనియొక్క జీవితమున నెచ్చటను జాకలివానిగొనములు, అనీచసంభావనా అయహంభావత్వము అజ్ఞానశూన్యత అమోటుపాట అవంచకత్వము అనీరాహారవిహారవ్యవహారాదులు ఇంచుకంతయు లేవు.

ఇతనియొక్క మాత వేదాధ్యయనసంపన్నులగు బ్రాహ్మణులయింట దాసిగా నుండెడిది. ఆపెయు సౌభాగ్యరాలుగఁ గనుపట్టెడిని. భళిరా! వపఁ గలముత్తె మొక్కటి చాలుఁగదా కులమునకుఁ గులమువారందఱకును వన్నెఁ దెచ్చుటకు! ఒక్క సత్పురుషపురుషుని సంభవమునఁ బూర్వాపరుల నైచ్యము వాయుటయే కాక కీర్తి గొప్పతనము నలవడునను! ఇందుననే యుభయకులముల నుద్ధరించునట్టి పుత్త్రికుండై సూర్యవస్య లింగఁగాఁ

బరితపించిరి; కాని నేటివలెఁ దరిద్రంపుబిల్ల కడుపు చెడఁ బొడము కలుగంపకూరవంటి గండ్రిలకుఁ గాదు. విషయసుఖాలోలత, భూమికి భరము గా, వన్నెఁజెడఁదీయు, జనించినవారికిఁబున్నామనరకోద్ధారక పుత్త్రి పుత్త్ర నామంబులు చెల్ల నేరవు.

నాందునిజనని మహాశాంతిగుణోపేతయయి యజమానులయందు భయభక్తులతో వినయవిధేయాతల మెలఁగుచుండెడిది. ఆత్మవంచన లేక కాయకష్టములు సరకుగొనక రాత్రింబవలు నాకు నిజయజమాను భక్తితాత్పర్యముల సేవించుచు మానాభిమానములు పోనాడకుండునది. బ్రాహ్మణసేవాతత్పరత నా పెకును సుగుణములు పట్టుపడుట యబ్బురమా! అత్తరు వంటిసవాతియు సుగంధము గుబాళింప గాదునా!

పిన్నట నుండియుఁ దన్నుఁగనను దల్లిసేవించు యజమానులకడను నుండుట నాందునకుఁ బెంకితి

కేము మారాము నల్లరిబిల్లరపనులు నవినీతము దొరకొనదమ్మ్యా. పెద్దలయెడ భక్తి వారిమాటయందు రక్తి వారియొక్క సేవయం దాసక్తి వారియొక్క యుపదేశమున శక్తి నాటినది: అగును బుట్టువున నీచాతినీచ మనుకొనఁ దగుకీటము సదా భ్రమరనినాదశ్రవణమున భ్రమరము గా కుండునా! భ్రమరకీటకన్యాయ మను సార్థోక్తి నారదునియెడఁ బూర్తిగా నొప్పినది.

సదా యజమానునిమాట జవదాఁట మెఱుంగనినారదుని జిహ్వతనమునసే యుఁతిచప్పిన నున్న వనమునఁ జాతుర్మాస్యదీక్ష వహించిన మునిచంద్రులపరిచర్యలకై వానియొక్క గురువులు నియోగించిరి. అహా! యెన్న మెప్పు జేది యొనర్చెను యునమేలునకే కదా! నారదుఁ డప్పటికి బాలుఁడు; కాలము వర్షాకాలము; అది అటవీప్రదేశము; నప్రసగుచది దాస్యము; అయినను జంకగొంకు అట

గండ యౌవనకౌమారదశలఁ బట్టి దేశకాల వ్య
క్త్యాదులఁ బట్టి యాస్వచ్ఛస్ఫటికము వివిధముఁ
జేయుచున్నారు. అట్టిపొఱపాటు అట్టిలోటుపాటు
అట్టిహైన్యదైన్యము అట్టిభవభయము అట్టిగానటవీ
వట లేకుంటకే యార్యవర్యులు చతురాశ్రమము
లు కల్పించినారు.

వానప్రస్థాశ్రమమున వాన, యెండ; వెలుపల
లోపల, నీరాహారము, ఉపవాసము; బట్ట, బొట్టు;
స్వపరతారతమ్యములు గణింపక యేకదీక్షను నా
రదుఁడు నాలుగుమాసములు వర్షాకాల శరత్కాల
ము లరుగుదనుక నాతపోధనుల సేవించెను. ఆమ
హానీయుల భుక్తాన్నశేషమునే యారగింపుచుఁ ద
త్పదసేవయే భాగ్యమనుచుఁ దత్సంభాషణయే భా
గ్యమనుచుఁ బరిపాటిగా వారిబోధనల మననమొన
ర్చుచు అయిదేండ్లవాఁడయ్యు నారదుఁడు ఐహిక
వాంఛలకు దూరస్థుఁడయ్యెను లోకమున నస్మిం

టను జయింప నలవికానిది మనము: అట్టి మనస్సు
ను జయించుటయే యింద్రియనిగ్రహము. జితేంద్రి
యత్వము పునర్జన్మరాహిత్యమార్గము: అట్టిది పిన్న
నాఁటనే పట్టుబడిన నిఁక దాని గట్టితనము నుడువఁ
దరమా! అట్టివాఁడు చిరజీవికాఁడా! వానికి ము
ల్లోకముల నడ్డు గలదా! ఇచ్ఛామాత్రస్రష్టఁడు, దివ్య
చక్షుయుతుఁడు, కామసంచారుఁడు. సర్వము తాను
తానే సర్వము, సర్వమయుఁడు

ఆత్మ సన్యాసికి అన్నియు నొక్కటియే.
ద్వంద్వములు లేవు భేదబుద్ధి సున్న. విజ్ఞానము మి
న్న. కావున పసివాఁడయ్యు నారదుఁడు ఎంగిలి ప
ళ్యాము, దాస్యము, దౌష్ట్యము అనుకొనక సర్వ
థా పొంగుచు వానప్రస్థుల సేవించి వానప్రస్థాశ్ర
మమును జవిచూచెను. ఇట్లే యుపచారము విచార
ములు లేక యుపచరించు చున్నవారదు ననుగ్ర
హించి యాబుషులును శ్రీమన్నారాయణనామక

థాసంకీర్తనమున వానికోర్కెలు పూరించిరి. ఈభంభరధ్వనియే మొద నాటి వానిని దుర్మ్రదుఁ జేసినది. ఆహా ! తొలుతఁ గనులు మిఱుమిట్లు గొలుపుచంచలలతలు చెవులు చిందఱవందఱ గావించు ఘనగర్జల దేహము నఖశిఖపర్యంతము నానించు కుంభపాతముల సర్వావయవములు కొట్టి బాధించు కఠినఘాతలఁ బాఱిన వాయువులు నెగురఁ గొట్టించు నశనిపాతముల నెంతయో పడు నప్పుడు ఘనుఁడు భూమి సారవంతముగఁ జేసి కుజనత్వము తొలఁగించి పాండిపంటల సాగించి యాయురారోగ్యాభివృద్ధి గావించి యుపకృతి మనుపుటకే కాని యపకృతికిఁ గాదు కదా ! కావుననే బ్రహ్మచర్యాశ్రమమున గురువులు శిష్యులఁ బరీక్షించుటలు.

ఇట్లు గురుశిక్ష పడసి శ్రీకృష్ణనామచింతన మనుగుఱు తెలిసిగి తన్నిష్ఠాగరిష్ఠుఁడై తాపత్రయదూరగుఁడై నారదుఁడు తిరుగఁ దనతల్లి కొలుచుబ్రా

హ్మణయజమానులఁ జేరియు మౌనియై రాగబంధ ములఁ దెగఁగోసి సంచరించుచుండె.

ఔరా ! అలసితి ననక యాఁకలిదప్పు లనక అర్ధమురేయి ప్రొద్దు చాల దనక మిట్టపల్లము లనక యెండ కొండ యనక దూరభార మనక-ఆహా ! మాతృప్రేమ నెంతని వ్రాయఁగలను-నారదునితల్లి వానప్రస్థులఁ గొలుచు చున్నతనచిన్నారిసుతుని వియోగమునఁ గనుపుండఁ బట్టి వీలయినపుడెల్ల సందు చిక్కినప్పుడు సయితము యజమానులయాజ్ఞ గైకొని యత్యానందమున వేగకై పరుగిడు ఆవుఁ బోలె యరణ్యమునకు వచ్చి, చెక్కిలి నిమిరి, చుబుకము చుంబించి పాలనొసఁగి నిలువయుంచినపదార్థములు తినిపించి నూఱాఱులు ముద్దులిడి చుంచు పొప్వ మేను నిమిరి యవయవములు స్పృశించి అక్కునఁ జేర్చి ఆనందోష్ణమధురబాష్పములు పుచ్చి చిలుకపలుకు లాలించి లాలించి వాలాయము విచార

శీతలక్షారవారిపూరనయనములఁ బోవుచుండెడిది.

అపి దైవాజ్ఞఁ గాలవశత నొకనాఁడు నిశీథమున వాలపాలఁ బితుక భూదేవాజ్ఞఁ జనుచు మిన్ను మన్ను తెన్ను కనరాని గాఢాంధకారమున సంత్రాంచు నడఁగఁ ద్రొక్కెను. అంత నాసర్పము నిలువున నెగిరి యాపెఁ గఱచెను. కాలానలజ్వాల కరాళదంష్ట్రాగళితధూలకము ఒకలాట నెగయ నాయమ యందుననే మూలచ్ఛేదనమ్మొందినయటఁ టిఁ బోలి నేలఁ గూలి ధారుణికి దూరమగు దారుణ మరణము నొందెను.

అనంతరము క్రమముగ నారదుండు స్వాదన నీమరణోదంత మెఱింగి యొఱుక కలవాఁడగుట వది తనయంతరంగము నలమ కూడ శ్రీకృష్ణధ్యానపరాయణుఁడై తల్లికి నుత్తరక్రియ లాచరించి యుత్తరాభిముఖుఁడై వెఱ్ఱివానిఁ బోలి యాడుచుఁ బాడుచు భూతలముఁ దట్టుచుఁ జేతులు గొట్టుచు వ

డవెడ నగుచుఁ గడుఁగడు వగచుచు వింతగా నంత సించుచు నెంతో గంతుచు మౌన మూనుచు తనన శుసరింపుచు బయలిఁ బట్టుచు హాయలు నెట్టుచు మేడలు, వాడలు, భవనంబులు, వనంబులు, పల్లెలు, పట్టణంబులు, ఝరులు, గిరులు, నదీనదవాపీకూప తటాకాదులు గడచి,సత్వములకు భయమందక పరమాత్మ ప్రకృష్టసత్వశాలియైహిమవత్పర్వతప్రాంత కాంతారముఁ జొచ్చి తృష్ణీపాన లడఁగ నిర్మలసలిలములుగ్రోలిధ్యానారూఢుఁడై తిర్యగ్జంతువులభ్రమింప జేయుజడతఁ బాడకట్టు చుండె. అయ్యారే! యట్టి మహాత్మునకు విశ్వవ్యాపకుఁడు విష్ణువు పొడకట్టు టబ్బురమా! శ్రీవిష్ణుసారూప్యము లభించుట వింతయా!

సర్వమయుండును, ఆకాశసంకాశదేహుండును, నగు శ్రీమహావిష్ణు వానారదుని మనోనిగ్రహమునకు మెచ్చి కట్టెదుటఁ బొడకట్టెను. ధైర్య

స్థైర్యముల నర్వావయవములు బంధించి మానసవ్యా
కమునఁ జరిగించి తదేకధ్యానమున నేమానవుఁ
డైనను నశేషమూర్తిఁ దా నభిలషించునో యా
మూర్తి పొడకట్టక మానదు. అట్లే శ్రీవిష్ణువు నార
దునకుఁ గానుపించి "నాయనా నీవింకను షట్కర్మలఁ
బూజ్యంబు చేసి యిట్లే నామీఁద మనసునిలిపి చలిం
పక వైహికముల కించుకయు లోనుగాక యుండిన
చో వారియొక్క పుట్టువున బ్రహ్మవిజ్ఞానమయుండవ వ
గుట శుద్ధసాత్వికాగ్రణుఁడవై బ్రహ్మపుత్రుఁడవై
మద్భక్తుఁడవై వెలయుదు" వనెను.

ఆహా! ద్విజన్మపదార్థమిదియకదా! పుట్టు
వు మొదలు కొన్నియేండ్లు అజ్ఞుఁడై యైహికబంధము
లవల్లలాడుచు వెనుక నోగుబాగుల నిహపరముల నే
ర్చి విజ్ఞానసంపన్నతఁ వహించుటయే ద్విజన్మము. అ
ట్టివారే ద్విజులు; కావుననే తొలుత శూద్రత్వ
మెల్లరకు నాపాదింపఁ బడినది. దాని బ్రహ్మజ్ఞాన

జించి మదము నణంచి మత్సరము నుడిగించి స్నిగ్ధఁ జించి శ్రీమన్నారాయణుని యనంతనామములు పఠించుచు నిర్మలాంతఃకరణమున విషయవిరక్తుఁడై యవసాన సమయమునఁ దత్ప్రాకృతదేహంబు విడిచి శ్రీవిష్ణువునం దైక్యమై పునస్సృష్టిసమయంబున శ్రీవిష్ణునాభికమలమున నుద్భవించిన బ్రహ్మ నుండి వెలువడి నారాయణనామకథాకీర్తనపరుం డయి ముల్లోకసంచారుం డయి యుండె.

నారదుఁడు సంగీతమున సాటి లేనివాఁడు సప్తస్వరముల శ్రీమన్నారాయణుఁ డడఁగి యుండుట వలన సప్తస్వరము లాధారంబుగా మహతి యను వేయి తంత్రులు గలవీణఁ జేకొని లయనాట్యవిలాసంబుల నాతనితోనే లయమయి పరిపూర్ణతేజుం డయి విలసిల్లుచుండె.

నారదుఁడు అఖండితబ్రహ్మచారి; పూర్ణమనస్సన్యాసి; త్రిలోకసంచారి.

నారదుఁడు ఆమహామూర్తి సందర్శనమునను వానియొక్క యాదేశమునను నూతనతేజోద్దీపనుఁడై బ్రహ్మతేజోరాశియై బ్రహ్మజ్ఞానసంపూర్ణుఁడై అనంతుఁడై యవికల్పుఁడై యవిచ్ఛిన్నుఁడై యానందమయుండై శ్రీవిష్ణునామసమ్మితమనఃపరిపూర్ణుఁడై నిరంతరకీర్తివిశ్రాంతపరిపూర్ణయశోవిలాసుఁడై మృతజీవుఁడై నెగడెఁ: గావుననే యామహానుభావుని బ్రాహ్మణునిగను చిరజీవిగను సర్వసంచారిగను సాత్త్వికనారదాభిఖ్యునిగను బరిగణించిరి.

కాని జ్ఞానలోకమున సారదృష్టి లేమి కథాచమత్కృతికిఁ గొంద రీమాన్యునిఁ గొండెగానిఁగను గడుపుబ్బుకసము గలవానిఁగను మార్చిరి. ఇది యెంతయుఁ దప్పు. దేశోపకారియు దేశక్షేమాభిలాషియు సర్వజనోద్ధారకుఁడును, సర్వాసులతాంవితుండును నగునారదమహర్షి సారదృష్టియై నిచ్చ

ద్పుట దుర్మార్గ ముందునో యెప్పుడెప్పుట నవ
కారాహంకారత్వములు మిమీమీరియుండునో యె
ప్పుడెప్పుట నారాయణభక్తి నశించునో యెప్పు
ప్పుట విషయాలోలత హెచ్చునో యెప్పుటప్పుట
నాయావికారములు దొలంగుటకై పాటుబడి యుం
డనే కాని తంతరగోట్లుదనమునకుంగాని స్వలాభ
మునకుంగాని కడుపు గడపుటకు కాని కయ్యాంతర్పిప్ప
యగుటకుం గాని కాదు కాదు ముమ్మాటికిం గాదు.

పాఠకులారా! ఈతండు అవ్వాడు కాదిప్పుడు
కా దెప్పటికి నుండు స్థిరజీవి. వీని కీసుస్థిరసుఖా
భవము నిస్సంగత్వము సర్వత్రాక్షింతేదము కలు
గుటకు మానసికపూర్ణదయే కారణము. మానస్సువా
దముంచినచో మరి యేదియు వలదు. మనోనిగ్రహ
మునకే నిగ్రహసాధనలు కాని మరియొకండమనకుం
గాదు. కావున నరమాత్మార్థము సేవించినవానికే
కల్గు నరమ్ము నర్వనమత్వము నర్వవిశ్వప్రజ్ఞత్వము.

